# జమీన్ రైతు

స్థాపకులు: నెల్లూరు వెంకటరామానాయుడుగారు

సంపాదకుడు: నెల్లూరు శ్రీరామమూర్తి

Regd. No. H. NL. 18
స్థాపితం: 1930
సంపుటి 67 సంచిక 49
5-12-1986
శుక్రవారం
12 పేజీలు రూపాయి


## ప్రతిపక్షాల పరువు తీశాడు!

**సమ్మె పరిష్కారానికి ముందుకు వచ్చిన నాయకులను నగుబాట్లపాల్జేసి, ఎన్టీ రామారావు...**

సమ్మె వ్యవహారంలో ప్రభుత్వ ఉద్యోగులు, రామారావు ప్రభుత్వం మాట ఏమోగాని తెలుగుదేశం పార్టీకి మిత్రపక్షాలుగా వున్న కాంగ్రెస్‌తో ప్రతిపక్షాలు మాత్రం దెంపదెబ్బ తిన్నాయి. అటు ఉద్యోగులు, ఇటు ప్రభుత్వంకూడా వారిని నమ్మని విచిత్ర పరిస్థితి ఏర్పడింది. కాంగ్రెసు పార్టీ సంగతి సరేసరి. మొదట కాంగ్రెసుపార్టీతో కలిసి ఎన్. జి. ఓ. ల పక్షాన నిలబడాలని ఈ పార్టీలు ప్రయత్నించాయి. శాసనసభలో ప్రతిపక్ష నాయకుడు శ్రీ ఎం. బాగారెడ్డి చొరవతీసుకుని ప్రతిపక్షాల సమావేశాన్ని ఏర్పాటు చేశారు. ఈ సమావేశానికి వచ్చింది. సి. పి. ఐ. నాయకుడు శ్రీ చెన్నమనేని రాజేశ్వరరావు ఒక్కరే. ఇట్లా లాభంలేదని శ్రీ బాగారెడ్డి కొంత వ్యవధి ఇచ్చి మళ్ళీ ప్రతిపక్ష నాయకులను ఆహ్వానించారు. ఎందరి ఇళ్ళకు కాదు పంపారు. మార్క్సిస్టుపార్టీ నాయకులు మినహా మిగతా ప్రతిపక్షాలు- జనత, భారతీయ జనతా, కమ్యూనిస్టు పార్టీల నాయకులు, వచ్చారు. సమ్మె పరిష్కారానికి ప్రభుత్వం చొరవ తీసుకోవాలని, చర్చలు ప్రారంభించాలని కోరుతూ సమావేశం అనంతరం మార్క్సిస్టేతర ప్రతిపక్షాలు ఒక సంయుక్త ప్రకటన విడుదల చేశాయి. ప్రభుత్వం పట్టించుకోలేదు. దీని తర్వాత నాటకీయంగా పరిస్థితి మారిపోయింది. ఈసారి కాంగ్రెసును వదిలివేసి మిగతా ప్రతిపక్షాలు కమ్యూనిస్టుపార్టీ కార్యాలయం మగ్దూం భవన్‌లో సమావేశం అయ్యాయి. మార్క్సిస్టు పార్టీకూడ హాజరు కావటమే కాకుండా ముఖ్యమంత్రితో చర్చలకుకూడా చొరవ తీసుకుంది. మగ్దూం భవనం సమావేశ నిర్ణయానికి అనుగుణంగా మార్క్సిస్టుపార్టీ నాయకుడు శ్రీ నర్రా రాఘవరెడ్డి తమకు ఇంటర్వ్యూ ఇవ్వవలసిందిగా ముఖ్యమంత్రిని కోరారు. మరురోజు ఉదయం పదిన్నర గంటలకు రావలసిందిగా ముఖ్యమంత్రి కబురు పంపారు. తెలుగుదేశంతో ఇప్పటికీ మిత్రపక్షంగా వున్న మార్క్సిస్టు పార్టీతోపాటు మిగతా ప్రతిపక్షాలుకూడావస్తున్నాయని, సమావేశానికి కొద్దిసేపు ముందే తెలుసుకున్న ముఖ్యమంత్రి శ్రీ రామారావు అధికారులతో, తెలుగుదేశం ప్రధాన కార్యదర్శి శ్రీ నారా చంద్రబాబు నాయుడితో చర్చించి ప్రతిపక్షాలతో కలవడానికి సిద్ధం అయ్యారు. ఈ సమావేశంలో కమ్యూనిస్టుపార్టీ ప్రతినిధిగా వచ్చిన శ్రీ కె.ఎల్. మహేంద్రకు,


మా హైదరాబాదు ప్రతినిధి


ముఖ్యమంత్రికి వాగ్వివాదం జరిగింది. ఒకదశలో శ్రీ మహేంద్ర వాకౌట్ చేసే వరకు పరిస్థితి వెళ్ళింది. శాసనసభలో ప్రతిపక్ష నాయకులకు ముఖ్యమంత్రి ప్రాధాన్యంఇచ్చి మాట్లాడటం శ్రీ మహేంద్రకు కోపం తెప్పించింది.

శ్రీ రామారావుకూడా ప్రతిపక్షాలతో కోపంగానే మాట్లాడారు. ఎన్.జి.ఓ. లతో కలిసి వేరెక్కి ప్రభుత్వాన్ని తమను దూషించిన ప్రతిపక్షాలకు ఇక్కడు రాయబారం నెరిపే హక్కులేదని ఆయన వాదన సారాంశం. ప్రతిపక్షాలు ప్రజాస్వామ్యంలో ఇలా టిపాత్రనే నిర్వహిస్తాయని వారు జవాబు చెప్పారుకాని తాము ముఖ్యమంత్రిగా కాకుండా, తెలుగుదేశం పార్టీ అధ్యక్షుడిగా ఈ మాటలు అడుగుతున్నామని శ్రీ రామారావు అన్నప్పుడు వీరు దృఢంగా సమాధానం చెప్పలేకపోయారు. దాదాపు గంటసేపు సమావేశమైన తర్వాత ప్రధాన కార్యదర్శితో మాట్లాడదామని ముఖ్యమంత్రి మాట వరుసకు చెబితే, దానిని నమ్మి కొని చర్చలు ప్రారంభం అవుతాయని వారు విశ్వసించారు. కాని జరిగింది వేరు. ప్రధాన కార్యదర్శితో మాట్లాడకపోగా, ప్రధాన కార్యదర్శి పి. ఎ. నుండి కూడా ఫోన్ వెళ్ళకపోగా, చర్చలు ప్రారంభం కాకపోగా తెల్లవారేసరికి నాసా, ఎస్మా కింద ఎన్. జి. ఓ. నాయకుల అరెస్టులు ప్రారంభమయ్యాయి కాంగ్రెసేతర ప్రతిపక్షాల నాయకులు తెల్లబోయారు. వారు


—కొరవ 6 వ పేజీలో


## జనార్దనరెడ్డితో జలగం వియ్యం!

మండల ఎన్నికలదృష్ట్యా నెల్లూరు జిల్లా కాంగ్రెసు నాయకుల సమావేశాన్ని పి. సి. సి. అధ్యక్షుడు శ్రీ జలగం వెంగళరావు ఈ నెల 8 వ తేదీన హైదరాబాదులో ఏర్పాటుచేశారు. చాలా కాలంగా తగాదాలలో వుండిపోయిన ఆ జిల్లాలో పరిస్థితులు విషమించేదశకు వెళ్ళాయి, అందువల్ల మండల ఎన్నికలలో కాంగ్రెసుదెబ్బతినకుండా అందరూ సమైక్యంగా పనిచేయడానికి తీసుకోవలసిన చర్యలను 8 వ తేది సమావేశంలో చర్చించగలరని భావిస్తున్నారు.

ఇక నెల్లూరు జిల్లాలో పరిస్థితివేరు. ఆ జిల్లాలో ప్రధానంగా కాంగ్రెసుపార్టీ మాజీమంత్రి శ్రీ నేదురుమల్లి జనార్దనరెడ్డి సారథ్యంలో నడుస్తున్నది. 1983 లో ఓడిపోయినా, 1985 లో టిక్కెట్ రాకపోయినా జిల్లాలో కాంగ్రెసు వ్యవహారాలలో ఆయనే ఇప్పటికీ ప్రధానపాత్ర నిర్వహిస్తున్నారు. జిల్లా కాంగ్రెసుభవన నిర్మాణాన్ని ఆయన అధికారంలో లేని సమయంలో పూర్తి చేయించారు. మామూలు పద్ధతికి భిన్నంగా "కార్తీక సమారాధన"ల పద్ధతిలో 'కార్యకర్తల గ్రామసభ'లను ఆయననిర్వహిస్తున్నారు. వాటికికూడ ప్రతిస్పందన బాగుందని అంటున్నారు. ఏదో ఒక కార్యక్రమం ద్వారా జిల్లాలో కాంగ్రెసు ను మళ్ళీ జీవం పోయడానికి ఆయన ప్రయత్నిస్తు


కొరవ 7 వ పేజీలో


**రాజధానిలో జిల్లా కాంగ్రెస్ ప్రత్యేక సమావేశం**

శ్రీకాకుళం జిల్లా కాంగ్రెసు వ్యవహారాలను పరిశీలించడానికికూడ ఆదేశోజన ఆజిల్లా నాయకుల సమావేశాన్ని శ్రీ వెంగళరావు రాష్ట్ర రాజధానిలో ఏర్పాటుచేశారు. శ్రీకాకుళంజిల్లా కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ వెంగళరావు అనుచరుడు కావడం, ఆయనపై ఎన్ని ఆరోపణలు, ఫిర్యాదులు వచ్చినా మార్చువేయగపోవడంతో

# మంత్రి విజృంభణకు కొత్త కారణాలేమిటి?

ఇరిగేషన్ మంత్రి శ్రీ శ్రీనివాసులురెడ్డి పర్యటన కార్యక్రమాలలో, ఉపన్యాస ధోరణిలో ఆకస్మికంగా ఏదో మార్పు కనిపిస్తున్నది. ఎక్కడా తగ్గకుండా, దూకుడుగా, ధిక్కారంగా ముక్తసరిగా మాట్లాడే శ్రీనివాసులురెడ్డిగారిలో రెండు సంవత్సరాల నుండి విజృంభణ ద్యోతకమవుతున్నది. ఎక్కడా అంతేననుకోండి. ఈసారి మరీ ఆయన ఉపన్యాసాలు ఔచిత్య భంగంగా వుంటున్నాయి. ఇప్పుడే కట్లు తెంచుకొని బయటపడ్డ వ్యక్తివలె, కొత్తగా స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు పొందిన మనిషివలె ఆయన వ్యవహరిస్తున్నారా అనిపిస్తుంది.

మామూలుగా ఆయన పర్యటనలు ఆయన నియోజకవర్గానికో, లేక గూడూరు ప్రాంతానికో, అదీ కాకుంటే నెల్లూరు - గూడూరు పట్టణాలకో పరిమితమైవుండేవి. అటువంటిది ఇప్పుడు జిల్లా వ్యాప్తమైపోయింది. ఇంతవరకు

> ముఖ్యమంత్రి పగ్గాలు పూర్తిగావదలివుండాలి-
>
> శ్రీనివాసులురెడ్డికే ఇజారా ఇచ్చివుండాలి-
>
> ఒకవర్గం పైవారి ప్రాపు కోల్పోయి వుండాలి-
>
> కొందరుశాసనసభ్యులు తనవైపు వస్తుండాలి.

ప్లానింగుబోర్డు, జి.ప సమావేశాలకు అధ్యక్షత్వం వహించడం; హైదరాబాదు తెలివిలో అర్థద్ధు తల్లక్రిందులు చేయించి తనకు అనుకూలం గావించుకోవడంవరకే ఆయన జిల్లా మంత్రిత్వం పరిమితమై వుండింది. అటువంటిది అవి జిల్లా వ్యాప్తమై, ఇప్పుడు నిజమైన జిల్లామంత్రి అనిపిస్తున్నారు.

గతపక్షంలో ఆయన కావలి, ఎంకమూరు, వెంకటగిరి, ఆత్మకూరు వగైరా తాలూకాలను చుట్టారు. ఈసారి ముఖ్యంగా మూడు మునిసిపాలిటీలమీద కేంద్రీకరిస్తున్నారు. శ్రీనివాసులురెడ్డి గారిలో హఠాత్తుగావచ్చిన ఈ మార్పుకు కారణమేమి? అందరినీ వూహింపజేస్తున్నది ఈ ప్రశ్న.

దానికి కారణాన్ని వూహించడంకూడా పెద్ద కష్టమేమీ కాదేమో? ఇంతవరకు కాస్తయినా పట్టుకొని వుండిన ముఖ్యమంత్రి ఇప్పుడు పగ్గాలు పూర్తిగా వదలివేసి వుండాలి; జిల్లాను పూర్తిగా శ్రీనివాసులురెడ్డిగారికే ఇజారాకు ఇచ్చివుండాలి. అదీకాక, ఇంతవరకు జిల్లాలో ద్విపక్షంగా వుండిన తెలుగుదేశంపార్టీ ఇప్పుడు ఏకపక్షమై వుండాలి. అంటే ఇప్పుడు వర్గాలు లేవనికాదు; ఒక వర్గం పైనుండు ప్రాపును పూర్తిగా కోల్పోయిందని భావం. అదీకాక, అంతకు ముందు ఒక్క శాసనసభ్యుడులేని తనకు, ముఖ్యమంత్రి కల్పించిన ప్రతిపత్తివల్ల ఇప్పుడు క్రమంగా కొందరు తనవైపుకు వస్తుండా! ఇవన్నీ రాజకీయవాదిలో ఆత్మవిశ్వాసాన్ని పెంపొందించి, ధైర్యాన్ని కల్గించి, విజృంభించడానికి దోహదం కలిగిస్తాయి. స్థానబలిమికాని తనబలిమికాదయా అని అంటారే, శ్రీనివాసులు రెడ్డిగారి విజృంభణకు హైదరాబాదు ఇచ్చిన చేయూతేగాని ఇక్కడ కొత్తగా కల్గిన వూపేమీకాదు!

ఔచిత్య భంగంగా మాట్లాడడానికి కూడా హైదరాబాదు భరోసాయేకారణం. కళ్లుతెరచినా, కళ్ళుమూసుకున్నా కలలో సైతంశ్రీనివాసులురెడ్డికిజనార్ధనరెడ్డికలలో వస్తాడనేది అందరూ ఎరిగిన పాతసత్యం. అయినా జనార్ధన జపాన్ని శ్రీనివాసులు రెడ్డిగారు వదలిపెట్టినట్టు లేదు. గత పర్యాయం ఆత్మకూరు బహిరంగసభలో ఎప్పుడో పి. వి. నరసింహారావుగారి ముఖ్యమంత్రిత్వంలో, తాను కాంగ్రెస్ తిరుగుబాటు శాసనసభ్యుడుగా వున్నప్పుడు, నరసింహారావుగారు వాకౌటు వస్తే తనకు ఆహ్వానం లేకపోయినా సభలోదూరి వేదికెక్కి గంటసేపు ఉపన్యాసం దంచిపారేశారట; ఆ మాదిరిగా డాక్టరు సుందరరామరెడ్డికూడా మాట్లాడారట. ఇద్దరికీ ఒక్కటేనా- సుందరరామరెడ్డి అనాహూతుడుకాదు, దొంగతనంగా దూరి వేదికెక్కినవాడు కాదు, పార్టీ తిరుగుబాటుదారు అంతకుముందే కాదు. అయితే శ్రీనివాసులురెడ్డిగారి మాదిరి కాకుండా డాక్టరుగారు.... నొప్పించక తానొవ్వక తప్పించుక తిరిగే సర్వప్రియుడు! అట్లనే బాలాయపల్లె, వగైరా సభల్లో నెలికం శంకరరెడ్డిమీద ధ్వజమెత్తారు. శంకరరెడ్డి అంటే తనను వెంకట

—తరువాయి 7వ పేజీలో



## పినాకిని తీరం

### లయతప్పిన అడుగు

ఈ పరిస్థితిని ఏమనాలో స్ఫురించక ఈమాట అంటున్నాను. పత్రికా వ్యాసంగము వ్యవసాయ బంధము నా కార్యరంగాలు. రెంటిలో ఏది తప్పినా తోచదు. పత్రికా రచనలో సరే గాను గెద్దులా తయారై పోయాను అంటే యాంత్రికంగా తయారై పోయానన్న మాట. రోజూ రావడం ఓపికున్నంత వరకు నాలుగు అక్షరాలు వ్రాసివ్వడం, ఆఫీసుకు వచ్చిన నలుగురితో మాటల్తో కాలక్షేపం చేయడం, సాయంత్రం గూటికి చేరుకోవడం.... ఈ కార్యసరళి మెకానికల్‌గానే తయారైపోయింది.

అట్లనే వ్యవసాయంకూడా. ప్రభుత్వ నిర్వచనం క్రిందకువచ్చే చిన్న రైతును నేను. విస్తీర్ణం ప్రధానంకాదు; వ్యవసాయం నాకొకవ్యసనం.దీన్నిఆసక్తిఅనడం సముచితంగావుంటుంది; అంతకుమించిన పిచ్చికాబట్టే వ్యసనం అనవలసి వస్తున్నది. ప్రతిసంవత్సరం రెండుపైర్లు పెట్టుకునేది అలవాటు. అందువల్ల సంవత్సరంలో ఎప్పుడూ చేలో ఏదోఒకపని జరుగుతుండేది; నిత్యం పోయి చూసి కలసివచ్చేది. ధూమాత ప్రదక్షిణం చేయడం, వేసినపైరు ఏపుగావస్తుంటే సంతోషపడడం, సరిగాలేకుంటే దిగజారడం.... వ్యవసాయంలో ఈ ఆటుపోటుల అనుభూతి సర్వసాధారణం.

అటువంటిది ఈ సంవత్సరం మొలగొలుకు సాగుచేయడానికి వీలులేకుండా పోయేసరికి ఏదో పోగొట్టుకున్నట్లు, ఏదో పెద్ద కొరత ఏర్పడినట్లుగా వుంది. కార్తెలకు తగినట్లుగాగాక వాతావరణం విరుద్ధంగా వుండడంకూడా చాల వెల్తి అనిపిస్తుంది. మొన్నొక పల్లెటూరి మనిషి మాట్లాడుతూ పండగనెల అప్పుడే ఎక్కడ అన్నారు. సాధారణంగా పండగనెల వచ్చేసరికి మొలగొలుకు నిండు పొట్ట ఏర్పడి గంభీరంగా తలవూపుతూ మరో నెలరోజుల్లో కోతకు సిద్ధంగా వుండాలి. ఈ సంవత్సరం కొందరు పదిపదిహేను రోజులనాడుకూడా మొలగొలుకునాటారు; కొందరు తక్కువరకం పైరు నాటుతున్నారు; కొందరు నార్లు పోస్తున్నారు. గ్రామీణ వాతావరణం అంతా అస్తవ్యస్తంగా వుంది. అందువల్లనే పండగనెల పదిహేనురోజులు లేకపోయినా పల్లెటూరి వానికి ఎంతో దూరాన వున్నట్లనిపిస్తున్నది.

పత్రికా వ్యాసంగంలో వలెనే వ్యవసాయరంగంలోకూడా 'థ్రిల్' వుంటుంది. రెంటిలోనూ ఈనాడు అది మృగ్యమేమో ననిపిస్తుంది. అందుకే అడుగు వేయడం లయ తప్పిందా అన్పిస్తుంది.

### యానాదిరెడ్డి రికార్డు సృష్టించాడు!

కావలి ఎం. ఎల్. ఎ శ్రీ కలికి యానాదిరెడ్డిది అన్నిటా రికార్డే!

స్పీడులో, చురుకుదనంలో; పది సెకండ్లు ఒక్కచోటకూర్చోలేకపోవడంలో; నాలుగురోజులపాటు కావలిలో నిలకడగా వుండలేకపోవడంలో: ఆస్తిమీద సవాల్‌గా తొడతట్టి ఎన్నికలలోనిల్చి గెలవడంలో; ధనాన్ని రెండుచేతుల్తో ఖర్చు చేయడంలో, ధారాళంగా మంచినీళ్ళప్రాయంగా ఖర్చుపెట్టడంలో; ఎవరి ప్రియవచనాలు వారికి వల్లించడంలో; అనుచరులను ఆకర్షించుకోవడంలో, రద్దుచేసుకోవడంలో; సమయానుకూలంగా రాజకీయాలు నడపడంలో; అఖండ కఠినమైన శపథంలో యానాదిరెడ్డిది ప్రత్యేకమైన రికార్డు.

అటువంటి యానాదిరెడ్డి మొన్న అన్నిటికి మించిన మరొక రికార్డు సృష్టించాడట. పుగ్గబట్టి నలభై ఎనిమిది రోజుల పాటు కావలిలో తిష్ట వేశాడట. అతని జీవితంలో ఇప్పటికి ఇంత దీర్ఘకాలం కావలిలో వుండింది లేదని కావలీయులు పరమ చోద్యంగా చెప్పుకుంటున్నారట. యానాదిరెడ్డి వూరకే వుండివుండడు. మొదటినుంచి సెలవులు దొరికివుంటాయి; రెండవది- పరిస్థితులు అంతకాలం వుండడానికి నిర్బంధించివుంటాయి. లేకుంటే అంత స్థిమితంగా వుండే మానవుడా అతను?

కావలి రాజకీయాలు జిల్లాలోనే ప్రత్యే

—తరువాయి 10వ పేజీలో

# జనవాణి

## కఠినచర్య కావాలి!

సిక్కు జాతిలోని ముష్కరులను సభ్య సమాజాలన్నీ వెలి వేయవలసిన సమయం ఆసన్నమైంది. సిక్కు మొస్సలిపదకు తీవ్ర వాదులు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకు ప్రత్యర్థులు; ఇకనుంచి వారు మొత్తం నాగరిక సమాజానికే శత్రువులు. తమ కిరాతక వాంఛలను తీర్చుకోవడానికి అమాయకప్రజల రక్తంతో నేలతల్లిని కలుషితం చేస్తున్న ఈ నీచులను ఒకరొకరిగా గుర్తించి, మనుషులు తిరుగాడే ప్రదేశాలనుంచి దూరంగాతరిమి, పచ్చి మంచినీళ్ళుసైతం పుట్టకుండా చేస్తేతప్ప, వారి పాపాలకు నిష్కృతి వుండదు.

30 తేది సాయంత్రం హోషియార్‌పూర్‌లో జరిగిన దారుణ సామూహిక మారణకాండ, సిక్కుజాతిపట్లనే యావద్భారతదేశంలో విరక్తిని, ఏహ్యభావాన్ని కల్గిస్తున్నది. ఇందిరాగాంధీ హత్యకంటే అధికంగా సామాన్యప్రజల మానసాలను కలచివేస్తున్నది. సిక్కులుగా పుట్టని నేరానికి, 24 మంది అమాయకులను పసిబిడ్డలు, స్త్రీలు అనే విచక్షణలేకుండా కిరాతకంగా కాల్చిచంపారంటే వారు సిక్కు మత ఔన్నత్యానికి కంకణంకట్టుకున్న విప్లవకారులు కాదు; మానవజాతి వినాశనానికి ప్రతినబూనిన ఘాతకులు.

వీరందరూ మామూలుగానే బస్సు ఎక్కారట; అందులోనే తమతోపాటు యమదూతలవంటి నలుగురుకిరాతకులు ప్రయాణిస్తున్న విషయం వారికి తెలియదు. బస్సు కొంతదూరం పోగానే, డ్రైవర్ను బెదిరించి, నిర్జనప్రదేశానికి మళ్ళించి, సిక్కులుకాని వారినందరినీ బస్సుదింపి, లైనులో నిలబడమని, పిట్టల్ని కాల్చినట్లు కాల్చిచంపి, అక్కడే నిలబెట్టిఉన్న స్కూటర్లపై పరారైనారట.

ఈ నీచుల పాశవికకృత్యాలేకాదు, వారిని అదుపుచేయలేని ప్రభుత్వాల అసమర్థతనుకూడా 70 కోట్ల భారతీయులు నిగ్గదీయ వలసిన సమయం ఇది. విషపు నురగలు క్రక్కుతున్న అధమాధము లను మాటలతో, మంచితనంతో దారికితేవాలని ప్రయత్నించడమంత మూర్ఖత్వం మరొకటిలేదు. అపార సైనిక, పోలీసు బలగాలను పెట్టుకుని, వందలకోట్లు వెచ్చించి సమకూర్చుకున్న ఆయుధసంపత్తి వుండీ, మతమూఢుల కసాయితనానికి వేలాదిప్రజల ప్రాణాలు ఆహుతి అవుతుంటే చూస్తూఊరుకోవడం ఘోరం, దారుణమైననేరం.

ప్రభుత్వాల అసమర్థతవల్లే, భింద్రన్‌వాలేకు స్వర్ణాలయంలో పట్టాభిషేకం చేసిన తీవ్రవాదులను బహిరంగంగా ప్రోత్సహిస్తున్న తోహ్రా వంటి గోముఖవ్యాఘ్రాలు మరొకసారి ఎన్నికలలో గురుద్వారాల పెత్తనం సంపాదించగల్గాయి. రాజీవ్‌గాంధీ, బర్నాలాలు శాంతివచనాలు పల్కుతూవుంటే, పంజాబ్‌లోని ప్రతి దేవాలయం మళ్ళీ దేశవిద్రోహుల ఆయుధాగారాలుగా మారడం తథ్యం

రాజకీయపరమైన ప్రయోజనాలను, పథకాలను ప్రక్కకు నెట్టి, కేంద్ర ప్రభుత్వం తీవ్రవాదులపై యుద్ధం ప్రకటించవలసిన సమయం ఇది. తీవ్రవాదులనేకాక, వారికి ఆశ్రయమిచ్చి, పోలీసుల కళ్ళుకప్పుతున్న ద్రోహులను, దేశ విదేశాలనుంచి వారికి ధనరాసులు క్రుమ్మరిస్తున్న జాతి వ్యతిరేకులను గుర్తించి, ఏరిపారేయడం ప్రభుత్వ కర్తవ్యం హింసకు ప్రతిహింస మనతత్వం కాకపోయి నప్పటికీ, ప్రజల ప్రాణాలకు గడ్డిపోచంత విలువకూడా లేకుండా పోతున్న దుస్థితిలో ప్రభుత్వాలు కఠినచర్యలు తీసుకోవడం న్యాయ విరుద్ధమేమీ కాదు.

సిక్కులకి బర్నాలాను గద్దెనెక్కించడంద్వారా, పంజాబ్ ప్రజలు తీవ్రవాదులపట్ల తమ నిరసనను వ్యక్తంచేశారు. ఈ ముష్కరులను అణచివేయడానికి ప్రభుత్వం తీసుకునే ఏ చర్యకైనా ఒక్క పంజాబేకాదు, యావద్భారతపౌరుల మద్దతు వుంటుంది. రాజీవ్ గాంధీ, బర్నాలా మెతకతనంపై ఆధారపడకుండా, అవసరమైతే అత్యయికస్థితి విధించి అయినా తీవ్రవాదులను నలిపిపారేయాలి; ఆ మొండిశిఖండి మళ్ళీ తలఎత్తకుండా భూస్థాపితం చేయాలి. అధికార దాహంతో, తీవ్రవాదులు పంజాబ్‌లో విచ్చలవిడిగా నరమేధం కొనసాగించడానికి దోహదపడుతున్న తోహ్రా, బాదల్ వంటి వారిని సైతం శిక్షించాలి.

# జనవాణి క్రైమ్

4 12 1936

### ఆంధ్ర హిట్లరు!

ఏమైనా ఆశేరి బొబ్బిలిమంత్రి మెత్తుకోక తప్పదు. అనుకొన్నది చేసి తీరతాడు. ప్రతంతం కల్పించు [illegible] వెనదీయడు భయం విడి యం అనేది ఏకోశానా లేదు. వీర బొబ్బిలి! హిట్లరంటే ఏ జర్మనీవంటో చూస్తాము. ఆ హిట్లరునుగూడ మించిన సాహసి ఈ [illegible]. కాంగ్రెసు ప్రెసి డెంటయితే ఏమి, వానితాత అయితే ఏమి, తన సమ్మతిలేకుండా బొబ్బిలిలో కాలు పెట్టకమే? జవహరులాలుని తరాభవంచేసి మరీపంపాడు. తర్వాతలో తరిమివేశాడు. ఏ నగ కుంభస్థలాలతో కుమ్మించాడు. జవహర్లాలు లైటి కెపోలీసు కాపలాతో బయటపడ్డాడు ఇక కాంగ్రెసు బొబ్బిలిలో నోరెత్తడానికి వీలులేదు. అది బొబ్బిలి హుం ఎవరైనా కాంగ్రెసులో చేరారా, వానిజాతికిలికి అడ్డంగా కంతెపాతిస్తాడు. ఏ దొడ్లోనైనా కాంగ్రెసు మీటింగు పెట్టారా? బందెల దొడ్లో పెట్టిన పశువులలాగు, వారిని వీధుల్లో కాలుపెట్టకుండా చేస్తాడు.

బొబ్బిలిలోకి ఎదురుపడు ఆ [illegible]? ఆంధ్ర హిట్లర్ !

(కృష్ణాపత్రిక పౌరశాల నుంచి)

జవహర్లాల్ స్వీయచరిత్ర 7 మాసాల్లో 10 ముద్రణలు

1936 సంవత్సరంలో ప్రథమ ముద్రణపొందిన పండిత జవహర్లాల్ స్వీయచరిత్ర 7 మాసాల్లో పది ముద్రణలుకని లక్షలకొలది వెలలో యినవట. ఈసంవత్సర ప్రచురణ ములలో యిదే ప్రథమస్థానమాక్రమించిందట.

అప్పుడే కంచెలు బిగిస్తున్నారు

సిద్ధాగుంట ---స్వరాజ్ మొన్న జిల్లాబోర్డు ఎన్నికల్లో కుమారంజా

### 50 ఏళ్ల క్రితం ఈవారం

గారికి 1 ట్లు ఇవ్వకుండా హనుమా రెడ్డిగారికి యిచ్చినందుకు కంచెపుల్లరు కట్టుకోకుండా శకరారు పెడుతున్నారట రెండవ రాజకుమారులు ఎంతకాలమీ నిర్బంధాలు?

ఎడ్వర్డు వివాహ విషమావస్థ

ఎడ్వర్డు సార్వభౌముడు ఒక అమెరికా సామాన్య గృహస్తుని కుమార్తెను పరిణయమాడనున్నాడు.

ఈ విషయము బ్రిటిషు మంత్రి వర్గమును బ్రిటిషు సామ్రాజ్యమును గ్రుక్కలకట్టు మహావిషమునకున్నట్లుగా పరిణమించింది. ఈ వివాహమును మానుకొనవలయును లేకున్న రాజ్యమును వదలుకోవలయునను ఎది ప్రాయముకల సందేశమును బ్రిటిష్ ప్రభుత్వముదారి పక్షమున ప్రధాన మంత్రి బాల్డ్విన్‌గారును, డొమినియను ప్రధానమంత్రులును రాజుగారికి అందచేసిరని తెలియుచున్నది.

రోజుకు 30 లక్షల పత్రికలు

జపానులోవుండే "ఒసాకా మైనిచి" అను పత్రిక దినమునకు 30 లక్షల పత్రికలు అమ్ముడుపోతాయి.

వెంకటగిరితాలూకా జమీన్‌రైతుల

కాన్ఫరెన్సు

ఫారెస్టు హక్కు ఆక్షేపణకు

వెంకటగిరితాలూకాలో ఫారెస్టు హక్కు అమల్లోపెట్టి రైతుల నర్వనిర్బంధాల పాలుచేయుటకు వెంకటగిరి ఎస్టేటువారు తీవ్రంగా ప్రయత్నిస్తున్నారు. రైతులంతా ఏకమై మహాసభజరిపి తీవ్రంగా ఆక్షేపించడానికి రైతులు ప్రయత్నిస్తున్నారు. ఆనాడు ప్రతి పల్లెనుంచి ఆబాల గోపాలం అందరవచ్చి సభలో తమ అసమ్మతిని గట్టిగా వెలిబుచ్చాలని అందర్నీ కోరుతున్నాం.

## జిల్లా ప్రజలలో స్పందనే లేదేమి?



ఆంధ్ర రాష్ట్రంలో నెల్లూరు జిల్లాకు ప్రత్యేకస్థానముంది. ఎంతోమంది మేధావులకు, రాజకీయ నాయకులకు, స్వచ్ఛంద సంస్థలకు పట్టిల్లు ఇటువంటి జిల్లాకో పట్టుమని పది ఫ్యాక్టరీలయినా లేవు గత రెండేళ్ళగా జిల్లాకు సంబంధించిన సమస్యలపైన ప్రజల ప్రతిస్పందన లేకపోవడం విచారకరం తెలుగుగంగ సమస్యకై రాయలసీమ ప్రజలు, ప్రజాప్రతినిధులు గగ్గోలుపెడితే మన జిల్లాకు సంబంధించి ఎవ్వరూ సరైన సమాధానం ఇవ్వలేకపోయారు. ఈ ఏడాది జిల్లా కరువును, నీటి సమస్యను ఎదర్కొంటే ప్రభుత్వానికిచెప్పి త్వరగా పరిష్కరించే నాధుడే లేడు.

ఇక ఇపుడు భయంకరమైన మెదడువాపు వ్యాధి జిల్లా అంతా వ్యాపిస్తూవుంటే, ముందు జాగ్రత్త చర్యలు సరిగా నిర్వర్తించలేక పోయారు. ఇలాంటి సమస్యలు వచ్చినపుడు విద్యార్థిసంఘాలు, సేవాసంస్థలయినా పరిష్కారానికి కృషి చేయడం బాగుంటుంది.

నెల్లూరు -వై. తిరిపాలయ్య

అధ్యక్షుడు

జిల్లా అంబేద్కర్ యువజన సంఘం

### ప్రజలను గొర్రెలుగా భావించకండి!

36 సంవత్సరాలు రాష్ట్రాన్ని పరిపాలించిన కాంగ్రెస్ ప్రభుత్వం కాలంలో ఏమాత్రం అభివృద్ధి జరగలేదు; తెలుగుదేశం అధికారంలోకి వచ్చి కొంతకాలమే అయినా మేమెంతో కృషిచేసి ప్రజల అభ్యున్నతికి పాటుపడుతున్నాం ప్రజలను దారిద్ర్యరేఖకు పైకి తెచ్చాం అని నాయకులు సభలలో ఉపన్యాసాలు దంచడం చూస్తుంటే వారింకా ప్రజలను గొర్రెలుగానే భావిస్తున్నారా అనిపిస్తుంది. ప్రభుత్వం రోజుకొకటిగా ప్రవేశపెడుతున్న పథకాలు ఎంతమాత్రం ప్రజలకు ఉపయోగపడుతున్నదీ అందరికీ తెలిసిందే ఇంకరుముందు ఎంతోబాగ జరుగుతున్న పథకాల పేర్లు మార్చి, రంగుపూసి క్రొత్తవిచేసారు. వాటికి సరైన పెట్టు

-కొరవ 7వ పేజీలో

# పినాకినీతీరం

(3 వ పేజీ తరువాయి)

కంగా వున్నట్టున్నాయి. సాధారణంగా ఆ విధమైన రాజకీయ రణరంగానికి గూడూరు పేరు. అక్కడ ఆ స్థానాన్ని కావలి తీసుకున్నట్టుంది. కాంగ్రెసుకు పెద్ద గా వచ్చింది తెలుగుదేశం ఒకటి: యానాదిరెడ్డి కాంగ్రెసు, కాంగ్రెసే యానాదిరెడ్డి. కావలి తెలుగుదేశం రాజకీయాలు గందరగోళంగా వున్నట్టున్నాయి. అంతర్గతంగా ఘర్షణ తత్వం, పరస్పర విరోధానికి పాల్పడటం.... అదంతా రహస్యంగా వుండటం కాంగ్రెస్ కల్చరు. తెలుగుదేశం రాజకీయసంస్కృతి తెలుగుదనంగానే వుంది; రహస్యంలేదుగిరహస్యం లేదు బహిరంగంగా తెలపడమే! కావలి ప్రాంతంలో తెలుగుదేశంపార్టీ పరిస్థితి నేడు అరకలో వున్నట్టుంది. దానిని వుపయోగించుకోవడం తన బలాన్ని సంఘటిత పరచుకోవడం యానాదిరెడ్డి గారి మందలరీతి కు కారణమై వుంటుంది.

కొంపదీసి కావలి తెలుగుదేశం గ్రూపు రాజకీయాలు కాంగ్రెస్‌కు బదిలీ కావుగదా?

## మరొక కొత్త సంఘం

నేను చాలాకాలంనుండి అనుకుంటున్న విషయం ఇది. టెలిఫోన్ వినియోగదార్ల సాధక బాధకాలకోసం పాటుబడే సంఘం ఒకటి వుండాలని అనుకునేవాణ్ణి; అది ఇప్పటికి నెరవేరింది. నెల్లూరు టెలిఫోన్ వాడకందార్ల సంఘ అధ్యక్షుడుగా శ్రీ పి. సి రెడ్డిగారి నుండి వచ్చిన ఒక ప్రకటన చూసిన తర్వాత నేననుకొంటుండిన సంఘం ఒకటి ఏర్పడినట్టు తెలిసింది. పూర్వం ఎప్పుడో పి. సి. సుబ్బయ్యగారు లో మరొకరో టెలిఫోన్ వినియోగదార్ల సంఘం అంటూ ఒకటి పెట్టినట్టు జ్ఞాపకం. అది ఏమైందో తెలియదు.

ఈ సంఘాన్నిగాని, ఆ సంఘాన్నిగాని శాగితంమీద చూడడంతప్పితే, టెలిఫోన్ వినియోగదార్ల సమావేశం ఒకటి పిలవబడినట్టు సమస్యలు చర్చించబడినట్టు అందులో కార్యనిర్వాహక వర్గం ఎన్నుకోబడినట్టు మాకు తెలియదు. మాలుసంబంధించి మూడువేలుగు ఫోన్లు వున్నాయి; వినియోగదార్ల సమావేశమంటూ జరిగివుంటే మాకూ తెలిసి వుండాలిగదా? తెలియదు కాబట్టి, అటువంటి సమావేశం జరగలేదనుకోవలసి వస్తున్నది. అంటే ఆ సంఘంగాని, ఈ సంఘంగాని వినియోగదార్లకు నిజంగా ప్రాతినిధ్యం వహించేవి కావన్నమాట. వినియోగదార్లకు ప్రాతినిధ్యం వహించే సంఘాలకే బలం వుంటుంది; విలువ వుంటుంది. అంతేగాని లెటర్‌హెడ్ సంఘాలు వ్యక్తుల ఆత్మసంతృప్తికి, పేరు ప్రఖ్యాతులకు పనికివస్తే ప్రజలకు వుపయోగపడవు. అయితే ఒక సంతోషం; పుత్తడుండకంటే అత్తముండ మేలన్నట్టు, ఏ టువంటి ఆందోళనలేకుండా వుండడంకంటే, పేరుకైనా ఒక సంఘపరంగా పనిజరగడం మేలుగదా!

టెలిఫోన్లు అధ్వాన్నంగానే వున్నాయి. సర్వీసూ సమర్థవంతంగా, బాధ్యతాయుతంగాలేదు; బిల్లులు కూడా అబద్ధంగా వుంటున్నాయి; బిల్లు తప్పుగా వేలకు వచ్చినా, ఆ మొత్తం కట్టందే తప్పు ఒప్పుల సంగతి ఆలోచించేదిలేదు పొమ్మంటారు; గుర్రంగుడ్డిదైనా దాణాకు తక్కువ లేదన్నట్టు నెలలో పదిహేను రోజులు ఫోను అర్డరులో లేకపోయినా, కట్టుబాట్లను మామూలుగానే కట్టుంది. ఒక లోకల్ కాల్సును నగరం. పోస్టాఫీసులు కేంద్రమాత్రం పెట్టి పోతున్నారు; పూరాలకి విస్తరింపచేస్తున్నాయి కాని విస్తరణ ఎంత ఎక్కువగా వున్నదో, సౌకర్యం అంత అధ్వాన్నంగా వుంది. కాలుల ద్వారా అప్పటికంటే ఇరవై ఏళ్ళక్రితమే మేలనిపిస్తుంది. నెల్లూరు నుండి హైదరాబాదుకు ఒకరోజుగాని, పత్రికగాని చేరాలంటే మూడురోజులైనా పడుతున్నదనుకోండి; నెల్లూరుటవున్‌లోనే ఒకమూలనుండి ఇంకోమూలకు చేరడానికి అంతకంటే తక్కువ టైంపట్టడంలేదు.

సమర్థత, సౌకర్యము పెరగకుండా చార్జీలమాత్రం పెరిగాయనే అభిప్రాయం ప్రజలకు కలిగేటట్టు టెలిఫోన్ రేట్లు, పోస్టల్ చార్జీలు పెంచుకుంటూ పోవడాన్ని ప్రజలు హర్షించలేరు. భరించలేరు. కాని ఆర్థికశాస్త్ర ఆచార్యులైన పి. పి. రెడ్డిగారిని ప్రశ్నించే అర్హత నాకు లేదు; కాని "వస్తువుల విధింపు సౌకర్యాలతో సంబంధం వుండవలసిన పనిలేదు" అనే సిద్ధాంతం ఏమిటో నా తోటి సామాన్యుడికి అర్థం కావడంలేదు. టెలిఫోను, తంతి తపాలాశాఖల విస్తరణ చాలా ఎక్కువగావుంది; పెట్టుబడి వ్యయమూ ఎక్కువైపోయింది. కాని సమర్థత తగ్గిపోయేసరికి జరిగిన అభివృద్ధి పరిగణనకు రావడంలేదు. సమర్థత తగ్గిపోవడానికి ఒక ప్రధాన కారణం- ట్రేడ్ యూనియనిజం. ఈ విధంగా ప్రతి సమస్యా ఒక విషవలయంగా వుంటున్నది.

పి. సి. రెడ్డిగారికి ఒక విజ్ఞప్తి: మీ సేవాసక్తికి, ప్రజాసమస్యలపట్ల మీ ఆసక్తికి అభినందనలు. కాని అన్ని సంఘాలకు మీరే అధ్యక్షత్వం వహించడం కాకుండా, కొన్నిటికైనా కొత్త వారిని ముందుపెట్టి మీరు వారివెనుక అండగా వుండి పనిచేయండి; బాగుంటుంది. అన్నిటికీ మీపేరే అనేసరికి వేరే అభిప్రాయం కలుగుతున్నది.

NSR

## ఇదీ నిజమే

(4 వ పేజీ తరువాయి)

మాధవవర్మ. చరిత్రకారులు ఇతనినే ఇమ్మడి మాధవవర్మ అన్నారు ఇతనికి ఒక్కడే కొడుకు. ఆ రాజకుమారుడు, దురుకుగా, ప్రమత్తతతో బెజవాడ పట్టణ వీధిలో రథాన్ని తోలుకొని పోవుచుండగా, మార్గము ప్రక్కన "తింత్రిణీ" అనగా చింతపండు, చింతకాయలు, చింతఆకు విక్రయించే అంగడి స్త్రీ. కుమారుడు రథం క్రింద పడి మరణించాడు. ఇది హత్యగా భావించి, ధర్మాసనాధ్యక్షుడైన ఇమ్మడి మాధవవర్మ, తన ఏకైక పుత్రునికి మరణదండన విధించాడు. ఇద్దరు కుమారులు మృతులైనారు. ఈ ధర్మనిర్ణయానికి

["తతో మల్లేశ్వర ప్రీతః, స్వర్ణ వృష్టిం పవర్తత"]

శ్రీ మల్లేశ్వరుడు ప్రీతిచెంది, ఆరాజు పై కనకవర్షాన్ని కురిపించాడట!"

అంతేకాదు-

["శిశు పుత్రకయోః ప్రాణాం, దత్తవాన్ తస్య కీర్తయే"]

తింత్రిణీకి బిడ్డకు, రాజపుత్రునికి ప్రాణదానం చేసాడు. ఇట్టి కీర్తి బెజవాడ శ్రీ మల్లేశ్వరునికి వుందని. ఈ 13 వ శతాబ్ది శాసనం పేర్కొంటుంది.

ఈ శాసనం S. I. I. సంపుటం X, నెం: 23, పే, 8 & 9,) లో ప్రచురింపబడింది.

ఇట్టి ధర్మనిర్ణయాన్నిగూర్చి, మరోసారి ప్రస్తావిస్తాను.

—నే. శ్రీ. కృ.





# రైతులోకం

(4 వ పేజీ తరువాయి)

గురించికూడ ఎనేకరకాల మందులను పరీక్షించడం జరిగింది. కలుపుమొక్కల నివారణకు మందులు వాడేటప్పుడు, వరి నాట్లు పూర్తి అయిన మొదటి 3 రోజులలో 2.5 సెంటీమీటర్ల నీరు నిల్వవుండాలి. నాట్లు పూర్తి అయిన నాలుగురోజుల తరువాత ఏడురోజులలోపల పైప్రక్రమే కలుపుమందులను వాడాలి. వెడల్పాకుగల ఊదలి, నీటుకూటు బూరగ, పిచ్చి మిరప గుర్రపుడెక్క మొదలైన కలుపు మొక్కలకు 2-4 డి. ఇ. ఇ అంటే 'నాక్‌ఓడ్' లేక 'ఎగ్రోకెక్స్' గుళికలు ఎకరాకు 8 కిలోలు చల్లాలి. ఊదరజాతి కలుపు మొక్కలు, తుంగజాతి కలుపుమొక్కలకు బెంథియోకార్బ అంటే 'సేటర్న్' గుళికలు ఎకరాకు 10 కిలోలు వేయాలి. అదే విధంగా గడ్డిజాతిమొక్కలకు బూటాక్లోర్ అంటే 'మేచెట్' లేక 'డెలక్లోర్' లేక 'హిల్టాక్లోర్' గుళికలు ఎకరానికి 10 కిలోలు వాడి నివారించవచ్చును.

## భవిష్యత్ పరిశోధనలు

1) ఎక్కువ తెగుళ్ళకు అంటే ప్రత్యేకంగా పొడతెగులు, అగ్గితెగులు, టుంగ్రో వైరస్ తెగుళ్ళకు పురుగులకు తట్టుకొని అధికదిగుబడినియగల రకాలను తయారు చేయటం.

2) ఇప్పటివరకు దోమపోటును తట్టుకోగల రకాలను తయారుచేయటం జరిగింది. కానీ, 1985 నుండి తెల్ల దోమకూడ ఎక్కువ నష్టాన్ని కలుగ చేయటంవల్ల, దానిని తట్టుకోగలరకాలను తయారుచేయవలసిన ఆవశ్యకత కనిపిస్తున్నది.

3) బాగా ఎక్కువదిగుబడి నీయగల సంకరపు వరిరకాలను తయారుచేయటం.

4) తెగుళ్ళను, పురుగులను తట్టుకోగల వరిరకాలు వచ్చేవరకు, వాటి నివారణకు మందులను పరీక్షించి తెలియచేయటం.

5) కలుపుమొక్కల నివారణకు తగిన మందులను తెలియచేయుటం.

## రైతులకు సలహాలు

ఇంతేకాకుండా శిక్షణ - సందర్శన అనే కార్యక్రమముక్రింద రైతులకు ఎదురయ్యే సమస్యలను ప్రతినెల వ్యవసాయ అధికారులు, శాస్త్రజ్ఞులతోకలిసి చర్చించి పరిష్కార మార్గాలను తెలుసుకుంటారు. ఈ కేంద్రాన్ని సందర్శించిన రైతులకు వరిసాగులో సందేహాలుతీర్చి సమస్యలకు పరిష్కారమార్గాలను సూచించుచున్నారు. వరిపై ఆధునిక యాజమాన్య పద్ధతులతో కరపత్రాలను ప్రచురించి అందచేయడం జరుగుతున్నది.

## వరదలవల్ల జరిగిన అపారనష్టం

1986, ఆగస్టు 16 వ తేదీన గోదావరి వరదలవల్ల ఈ పరిశోధనాస్థానము ప్రప్రథమంగా ముంపుకు గురికావటం, పరిశోధనలోవున్న కొన్నివందల రకాలు, ఇతర పరిశోధనా పంటలు పూర్తిగా నీట మునిగి, వరిమొక్కలు కుళ్ళిపోవటం జరిగింది. దీనివలన పరిశోధనలు తిరిగి మొదలుపెట్టవలసిన పరిస్థితులు ఏర్పడినవి. ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ విశ్వవిద్యాలయ వైస్-ఛాన్సలరు డాక్టరు ఎ అప్పారావుగారు సెప్టెంబరు 2 తేదీ వరదముంపుకు గురైన ఈ పరిశోధనా స్థానాన్ని చూచి, పరిశోధనలు తిరిగి వెంటనే మొదలుపెట్టుటకు అవసరమైన వరిరకాలను కటక్‌లోని కేంద్ర వరి పరిశోధనాస్థానము నుండి, హైదరాబాద్ రైస్ డైరెక్టరేట్ నుండి, ఫిలిప్పైన్స్ అంతర్జాతీయ వరి పరిశోధనాస్థానము నుండి తీసుకురావటానికి తగిన ఏర్పాట్లు చేసినారు. తిరిగి కొలదిసంవత్సరముల లోనే అత్యధిక దిగుబడినీయగల వరి రకాలను, అనేక తెగుళ్ళకు, పురుగులకు తట్టుకోగల వరిరకాలను విడుదలచేయటం జరుగుతుందని ఆశించుదాం.

[మార్టేరు పరిశోధనాలయంలో తయారైన, పరీక్షించి విడుదల చేయబడిన వరి రకాల వివరం మరువారం —సం]

★

# 89 యేట ఈతముక్కల రామిరెడ్డిగారి నిర్యాణం

జననం
ఫిబ్రవరి 1898



మరణం
నవంబర్ 1986

మా అభివృద్ధికి కారకుడు, మాకు మార్గదర్శి మమతానురాగాలతో పెంచి
మమ్ము ఇంత ఉన్నత స్థితికి తీసుకువచ్చిన మా తండ్రిగారు

## శ్రీ ఈతముక్కల రామిరెడ్డిగారు

బుచ్చిరెడ్డిపాళెం

25-11-86 తేది ప్రశాంతంగా నిర్యాణం చెందారు.
వారులేని లోటు మాకు ఎన్నటికీ పూరించలేనిది. వారికి దైవసాన్నిధ్యంలో
శాంతి కలగాలని ప్రార్థిస్తూ, వారికి మా ప్రగాఢ శ్రద్ధాంజలి ఘటిస్తున్నాము.

## వారి కర్మక్రతువులు

**17-12-87** తేది బుధవారం శిలాప్రతిష్ఠ (నిలుపు)
**18-12-86** తేది గురువారం శిలోద్వాసన (ఎత్తురేవు)

కుమారులు : ఈతముక్కల కృష్ణారెడ్డి, ఈతముక్కల రాఘవరెడ్డి
కోడళ్లు : శకుంతలమ్మ, రమణమ్మ
కుమార్తెలు : యేలూరు సరోజనమ్మ, పొన్నపోలు సుశీలమ్మ
అల్లుళ్లు : యేలూరు సంజీవరెడ్డి, పొన్నపోలురాఘవరెడ్డి

Edited, Printed & Published by N. Sree Ramamurthy at the Zamin Ryot Press, 170, Thipparajuvari Street, Nellore (A. P.)